నవప్రచురణం 9

# ఇల్లరికం

కథల సంపుటి

కొడవటిగంటి కుటుంబరావు

నాలుగణాలు

యువకార్యాలయం, తెనాలి.

# ఇల్లరికం

## ౧

అమ్మా నాయనా కలిసి తమ ఏకైక పుత్రుడు శంకర్రావును వెయ్యికళ్ళతో కనిపెట్టి రక్షించే టప్పుడు ఆ పిల్ల వాడికీ అనుభవానికీ మధ్య తాము పెట్టనిగోడలల్లే నిలబడి ఉండి అతన్ని ఎందుకూ పనికిరాని వాజమ్మగా తయారు చేస్తున్న సంగతి తెలుసుకో లేక పోయినారు. అబ్బాయి ఆటలకూ పాటలకూ పోతే చెయ్యో కాలో విరిగి పోతుందేమో! స్నేహితులతో తిరిగితే చెడిపోతాడేమో! అబ్బాయిని జవాను బడిదగ్గిర దిగవిడిచి రావాలి, మళ్లా వాడే బడినించి వెంటపెట్టుకు రావాలి. అబ్బాయి చీకటి పడ్డ తరవాత ఇల్లు కదలటానికి ఎంతమాత్రమూ వీలులేదు. ఫలితం? అబ్బాయికి ఎవరితోనూ మాట్లాడట మైనా చాతకాదు; బజారుకు పోయి కానీ గుండుసూదులు కొనుక్కు రావటమైనా తెలీదు; మేస్టరుగారు గట్టిగా మాట్లాడితే అబ్బాయి బావురు మని క్లాసులో ఏడిస్తే

అబ్బాయి ఉపాధ్యాయు లందరితోనూ "అయ్యా, అబ్బాయితో గట్టిగా మాట్లాడకండి.!" అని నాన్నగారు వెళ్ళి హెచ్చరించి రావలిసి వచ్చింది. అసలే అబ్బాయి అంతంత మాత్రపు తెలివి తేటలవాడు—అమ్మకూ నాన్నకూ లేసి తెలివి తేటలు అబ్బాయి కెక్కడినించి వస్తైగనకా ?

అయితే పెద్దలు సంపాదించి కట్టుకుపోయినంతఉంది కనక అబ్బాయికి స్కూల్లో ఎంతమంది మేస్టర్లో ఇంటిదగ్గిర కూడా అంతమంది మేస్టర్లని పెట్టి ప్రైవేటు చెప్పించి ఒక్కొక్క క్లాసే దాటేయించారు. అబ్బాయి మెట్రిక్కు గానే చుట్టుపక్కలఉన్న లక్షాధికారుల అమ్మాయిలలో ఒక అమ్మాయిని ఏరి అబ్బాయి చేత అమ్మాయికి మూడు ముళ్లూ పెట్టించారు.

అబ్బాయి కాలేజీ చదువు చదవటమూ మానటమూ అనేది పెద్ద సమస్య అయిపోయింది. అమ్మగారు అబ్బాయిని అరక్షణమైనా విడిచి ఉండలేదు. నాన్నగారుకూడా అంతే మరి. అయితే అబ్బాయి మామగారికి మాత్రం అల్లుడు ఐ. సి. ఎస్. అయితే బాగుండునని ఉంది.

మూడు రోజులపాటు రాగాలూ, పెడబొబ్బలూ, నిద్రాహార విసర్జనాలూ ఉపోద్ఘాతంగా అబ్బాయి నాన్నగారితో కూడా పట్టణం ప్రయాణమైనాడు, కాలేజీలో ప్రవేశించటానికి. రోజూ అబ్బాయిని ఉత్తరం రాస్తూండమని చెప్పి బండి కదలగానే అమ్మగారు అల్లాగే మూర్ఛపోయింది.

## ౨

అబ్బాయిని నాన్నగారు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రవేశపెట్టి విక్టోరియా హాస్టల్లో చేర్పించారు. అతన్ని విడిచి రావటానికి కాళ్ళాడలేదు నాన్నకు. వాళ్ళ గ్రామం కుర్రవాళ్లు కాలేజీలో ఇంకా ఇద్దరున్నారు. అందులో ఒకడు శంకర్రావుకు మొదటినించీ సహాధ్యాయి—స్నేహితుడుమాత్రం కాడు. ఆ ఇద్దరు కుర్రాళ్ళతోనూ నాన్నగారు "ఏమర్రోయ్, అబ్బాయిలూ, మనవాణ్ణి కాస్త కనిపెట్టివుండండి. మీరు వెంటలేకుండా వాణ్ణి ఎక్కడికీ పోనివ్వకండి. జాగ్రత్తసుమా!" అని మరీమరీ చెప్పి ఇంటికి వచ్చేశారు.

వాళ్ళఊళ్లో ఆయన గొప్పవాడు కాని పట్నంలో ఆయన గొప్పేమిటి? ఆయన ధార్ష్టికపు విజ్ఞాపన ఆ కుర్రవాళ్ళకు అసహ్యం కలిగించింది. పట్నానికి ప్రతిసంవత్సరమూ ఎంతమంది కుర్రాళ్లు రావటంలేదు? తమకు వీడి కాపలా ఏమిటి, తద్దినం?

శంకర్రావు సహాధ్యాయికి మరీ మండింది. ఈవాజ ఎన్నడూ తనను పలకరించినపాపాన కూడా పోయిన వాజ కాదు, స్కూలులో చదివినంతకాలమూనూ. సంపన్నుణ్ణి నిక్కు. వాడినిక్కూ వాడిసంపదా వాడికే ఉండుగాక! తనకేమిటి? "ఏమోయ్, ఏమోయ్? ఇదేమిటోయ్ అదేమిటోయ్?" అంటూ శంకర్రావు తనని పలకరించబోయినప్పుడల్లా వాడికి మండిపోయేది. శంకర్రావు మొదటి మూడురోజులూ సమస్తమూ కోల్పోయిన వాడల్లే బిక్కమొహం వేసుకుతిరిగి, నాలుగోరోజునించీ

మళ్లీ మానవప్రపంచంలో పడి, తన సహాధ్యాయిని ఊరు చూడటానికి వెంటరమ్మన్నాడు. సహాధ్యాయి సరేలెమ్మని కూడా, తలాయించాడు.

## 3

**పట్నంలో** కాలుపెట్టి నెల తిరగకపూర్వమే అబ్బాయి ఎటువంటివాళ్ళ చేతుల్లో పడాలో అటువంటివాళ్ళ చేతుల్లో పడ్డాడు. వాళ్ళల్లో ఒకడు మరొక కాలేజి విద్యార్థి. రెండో వాడేమిటో వాడికే తెలీదు. ఇద్దరూ కలిసి తిరుగుతూండే వాళ్ళు. వారికి శంకరం ట్రిప్లికేను బీచిమీద తటస్థపడ్డాడు.

శంకరావును చూచిన మరుక్షణంలో వాణ్ణి ఆఇద్దరూ పుస్తకం చదివినట్టు చదివారు; వెంటనే వాడి తోటి పరిచయం సంపాదించారు; రెస్టారంటుకు తీసుకొని పోయినారు. ముగ్గురూ తిని వాడిచేత డబ్బు లిప్పించారు; సినిమాకు తీసుకుపోయినారు. వాడిచేత టిక్కెట్లు కొనిపించారు; సినిమా అయినతరవాత బారుకు తీసుకు పోయినారు, వాడిచేతకూడా తాగించారు; వాడు కక్కున్నాడు, కాని డబ్బుమాత్రం ఇచ్చాడు. మళ్ళీ కనిపిస్తామని చెప్పి వాడిదగ్గర చెరొక రూపాయీ తీసుకుని వాళ్ళు వెళ్ళి పోయినారు.

అబ్బాయికి తోడులేకుండా బస్సెక్కటం చాతకాలేదు. ఆఖరుకు [illegible]రవచేసి మైలాపూరు బస్సెక్కితే బస్సువాళ్లు దించేశారు. తరవాత మరి బస్సురాలేదు. రిక్షావాళ్లుమాత్రం పిలులలే ఖాళీరోడ్లమీద కారాడు

తున్నారు. ఒక రిక్షావాణ్ణి పిలిచి ట్రిప్లికేనుబస్సు వస్తుందా అని అడిగితే వాడు శంకరానికి అరవం రాదని కనుక్కొని అరవంలో ఏదో వాగాడు.

"విక్టోరియా హాస్టలుకు తీసుకుపోతావా?" అని అడిగాడు శంకరం వణుకుతున్న గొంతుతో. వాడు సరే, ఎక్కమన్నాడు. విక్టోరియా హాస్టలుదగ్గరదించి రిక్షావాడు రూపాయి ఇయ్యమన్నాడు. శంకరం మారు మాట్లాడకుండా ఇచ్చాడు. ఇంకా ఎక్కువ అడగనందుకు తన్ను తాను అరవంలో నానాబూతులూ తిట్టుకుంటూ రిక్షావాడు వెళ్ళిపోయినాడు.

హాస్టలు మూసివుంది. శంకరం బీచిమీద పడుకుని తెల్లవారుజాముకు నిద్రపోయినాడు.

మర్నాడు సాయంకాలం స్నేహితులిద్దరూ మళ్ళీ వచ్చారు. ఎక్కడికీ పోవటానికీ తన దగ్గిర డబ్బులేదన్నాడు శంకరం. డబ్బున్నదికాని, వాళ్ళవెంట పోవటానికి భయంవేసింది. డబ్బు లేకపోతే తన్ని పుట్టిస్తామన్నారు కత్తెరగాళ్లు. హడిలిపోయి శంకరం వారివెంట మళ్ళీ వెళ్ళాడు. కిందటిరాత్రి శంకరం బీచిమీద పడుకోవలసివచ్చిందని ఈరాత్రి వాణ్ణి స్నేహితులు ఒకానొక వీధిలో ఒకానొక ఇల్లు చేర్చి అక్కడ వాడు పడుకునే ఏర్పాటు చేశారు. వాడి పక్కలో మరెవత్తో వచ్చి పడుకుంది. గుండెవగిలి శంకరం మంచంపట్టెను గట్టిగా కరుచుకుని పడుకున్నాడు.

తెల్లవారిన తరవాత బస్సుకు మాత్రం డబ్బులిచ్చి పర్సు తమదగ్గిరే ఉంచుకుని శంకరాన్ని స్నేహితులు

సాగనంపారు. హాస్టలువార్డెను శంకరం హాస్టలులో లేక పోయినందుకు గట్టిగా మందలించాడు.

౪

అబ్బాయిని స్నేహితులు మాత్రం వదలలేదు. వాళ్ళను ఎట్లావదిలించుకోవలసిందీ అబ్బాయికి తెలియలేదు. కాలం గడిచినకొద్దీ అటువంటి ఆవశ్యకతకూడా తగ్గిపోయింది. అన్నివిషయాలలోనూ తనుకూడా వాళ్లంతవాడయ్యేటప్పటికి వాళ్ళనుచూస్తే వెనకఉండినభయం పోయింది. డబ్బుకు డబ్బావస్తున్నది ఇంటినించి. అబ్బాయి డబ్బు ఖర్చుచేస్తున్నాడని కొంచెం సనుక్కుతున్నాడు నాన్నగారు ఇంటిదగ్గర. అయితే అమ్మగారు మాత్రం "అయ్యో, అదేమిటండీ? పట్నంలో ఖర్చుకాదా ఏమిటి? మరీబీదవాడికి మల్లేఉండమంటారుటండీ, దాంమొపతేగా! అంతావాడికేగా!" అని భర్తమీద ఆడతర్కం చాలా ఉపయోగిస్తూ వస్తున్నది.

ఇక్కడ అబ్బాయి హాస్టల్లోనించిలేచి వేరేగదులు తీసుకున్నాడు. వాడిస్నేహితులు వాడు తెచ్చేడబ్బుకు కూడా పరిమితిఉందని కనిపెట్టి ఇంకా కొత్తవాళ్లను పట్టుకొస్తూ న్యాయంగా దోపిడిలో శంకర్రావుకుకూడా భాగం పెడుతున్నారు. తనుఒకప్పుడు వంచనఅయినవాడే అయినప్పటికీ వాడికి ఇతరులను వంచించటం సరదాగా ఉంటున్నది. తమజట్టులో కలుస్తున్నవారినిచూస్తే వాడికి కించిత్తయినా గౌరవంలేకపోగా పరమఅసహ్యంకూడానూ. మొదట్లో తన స్నేహితులుకూడా తనను అట్లాగేచూశా

రనే ఆలోచన వాడికి తట్టలేదు.

వాడు కాలేజీ కూడా మానేశాడు. ఎవరితోనో పట్నం లేచివచ్చి, ఒంటిమీది నగలన్నీ పుస్తెతో సహా క్రమంగా అమ్ముకుని తిని ఆఖరుకు సొమ్ముతోపాటు లేవ దీసుకుని వచ్చిన వాణ్ణికూడా పోగొట్టుకుని ఒంటిరిగ త్రైగా నిలిచిపోయిన ఒక ఆడమనిషి శంకరం పాలపడ్డది. ఆమ నిషి వచ్చినప్పటినుంచీ శంకరానికి మరొకలోకమే లేదు. ఏకారణం వల్లనో వాడికి బోగంవాళ్ళంటే చెప్పరాని భయంగా ఉంటూ వచ్చింది. వాళ్ళజోలికి పోకుండా తప్పించుకు తిరుగుతూ వచ్చాడు. అంత చిన్నవయసులో ఉన్నవాడు ఆడదాని పరిచయం అయిదునిమిషాల్లో చేసుకోవాలంటే కష్టమేమో. ఈ ఆడమనిషితో అటువంటి చిక్కు లేక పోయింది.

౫

అబ్బాయిని నాన్నగారు ఈప్రపంచంలో ఉండగా వచ్చి కళ్ళారా చూడగలిగారు. ఆయనకు కొడుకునుగురించి కబుర్లు వెళ్ళినై. అబ్బాయి దసరా సెలవులకు ఇంటికిరాక పోవటం ఈకబుర్లన్నీ విన్నమీదట అనుమానాస్పదంగా కనిపించింది. ఆయన ఇంటిదగ్గర భార్యమీద ఎగిరి పడ్డాడు.

అబ్బాయి చెడిపోతున్నాడన్న భయం అమ్మగారికి కలగలేదు. పైగా అటువంటి లుచ్ఛాఖోరు కబుర్లు విశ్వసించినందుకు ఆవిడగారికి భర్తమీద తాటిప్రమాణం

కోపం రేగింది.

"ఈరభస అంతా దేనికి? నేను స్వయంగా వెళ్ళి అబ్బాయి యెల్లావున్నాడో చూసివస్తాను!" అన్నాడు తండ్రి.

అదుగో, నువ్వు అబ్బాయిమీద ఎవళ్ళేవళ్ళో చెప్పిన వన్నీ నమ్ముతున్నావన్నది భార్య. ఆవిడతో తర్కించటం వృథా అనుకుని తండ్రి మాట్లాడకుండా ఆరాత్రి బండికే పట్నం బయలుదేరాడు. అబ్బాయి డబ్బు కాలేజి అడ్రసుకు తెప్పించుకుంటూ ఉండటంవల్లనూ, కాలేజీకి రాక పోవటం వల్లనూ ఎక్కడ ఉంటున్నదీ తెలియలేదు. అబ్బాయి హాస్టల్లో ఉండటంలేదనీ, కాలేజీలో అబ్బాయి పేరు కొట్టేశారనీ మాత్రమే తెలిసింది నాన్నగారికి.

కాని కాలేజీలో చదువుతున్న శంకర్రావు సహాధ్యాయి కష్టపడి నాన్నగారిని అబ్బాయి ఉంటున్న ఇంటికి తీసుకుపోయి విడిచిపెట్టి చల్లగా తిరిగి వచ్చేశాడు.

అబ్బాయి కలలు అయిపోయినై. అతను మారు మాట్లాడకుండా నాన్నగారివెంట ఆరాత్రి మెయిలెక్కి ఇంటికి వచ్చేశాడు.

౬

"నిన్ను మేమిద్దరమూ కలిసి చెడగొట్టాం. నువ్వీ ఇంట్లో బాగుపడవు. పోయి మీమామగారియింట్లో ఉండు. ఆయనకు నిన్ననే ఉత్తరం రాసేశాను. బహుశా ఇవాళ ఆయనే వస్తాడు. నీభార్య రజస్వలాకూడా అయింది. నువ్వక్కడే

ఉంది మీమామగారు ఇష్టపడ్డప్పుడు నువ్వు నీభార్యతో కాపరం ప్రారంభించవచ్చును. నువ్వు బాగుపడ్డా చెడిపోయినా ఆయన పూచీయే కాని నాపూచీ ఏమీ లేదు. నేను ఘట్టిగా చెంపలువేసుకుంటున్నాను జరిగిన దానికి. నాకు చాతకాదు. మీమామగారికి చాతకాకపోతుందీ? నీ ఖర్మంనీది!" అని నాన్నగారు తేల్చిచెప్పేశారు.

అమ్మగారు ఏమీమాట్లాడ లేదు. ఆవిడ అబ్బాయిఇంటికి వచ్చిన క్షణం నించీ గుండెవగిలేటట్లు రాగాలు పెడుతున్నది.

ఆవాతావరణంలో అబ్బాయికి చచ్చు వాతం కమ్మినట్టయింది. "పొరపాటున చేశాను. అటువంటి పనులుచెయ్యను. ఇకముందు సరిగా ఉంటాను!" అందామనుకున్నాడు అబ్బాయి. కాని నోరు పెగలలేదు. పట్నం వదిలి పెట్టగానే వాడికి తన ప్రకృతియావత్తూ మారినట్టయింది. మళ్ళీ వెనకటి వాడ మిగిలాడు. వెనకటి వాడ ఈనాన్నకూ అమ్మకూ దగ్గర వాడుగా నన్నా ఉండేవాడు; ఈవాడ కిక్కడ ఎవరూ లేరు. కేవలమూ ఒంటిరిగాడు!......

## 2

తన మామగారితోపాటు ఇంటరు క్లాసుపెట్టెలో కూర్చుని అత్తవారింటికిపోతూ శంకరం ఆశ్చర్యపడ్డాడు ఇందులో తనకు శిక్ష ఏముందాఅని. తండ్రి తనను మామగారికి వప్పగిస్తానన్నప్పుడతను అదేదో తనకుశిక్షగాభావించాడు.

కాని మామగారిని చూసిన కాస్సేపట్లో ఆ అభిప్రాయం పోయింది. ఆయన తనను చూడగానే మామూలుగానే పలకరించాడు. తనతో ఆయన పెద్దదీర్ఘ సంభాషణలేమీ చెయ్యని మాట వాస్తవమేగాని ఆయన ఎప్పుడూ మితభాషే. మొత్తంమీద ఈ ఏర్పాటే బాగున్నది. తనను చూసి అమ్మా నాన్నా కంగారవుతున్నారు. వాళ్ళను చూడటమే పుండు కెలికినంత బాధగా ఉంది.

అత్తవారింటికి వెనక వెళ్ళినప్పుడల్లా ఎంత బాగా చూసే వాళ్ళో శంకరం మరిచిపోలేదు. ఆ విధంగా తనకు ఎంత కాలం వెళ్ళినా వెళ్ళినట్టే. తన్నుతో గారెలతట్టలో పడేట్టున్నది అతని ప్రాణానికి.

ఈ మురుపు అత్తవారిల్లుచేరిన అరగంటలో వదిలింది అబ్బాయికి. అతన్ని ఆడజనం ఎవరూ పలకరించలేదు. మగవాళ్లు పలకరించినా ఆపలకరింత ఎట్లాఉండాలో అట్లాగేఉన్నది. తనను అత్తవారింట కుష్టువాణ్ణిచూసినట్టు చూడబోతున్నారని వాడికి స్పష్టమయింది.

"వెధవలు, మీతో నాకేమిటి? ఎంత చెడ్డా నేను అల్లుణ్ణి!" అనుకున్నాడు శంకరం. అకస్మాత్తుగా వాడికి ఒకచిత్రమైన మనోవిశ్వాసం కలిగింది: చేసింది తప్పో ఒప్పో; తనే మగవాడు. ఈవెధవలు తను చేసిన పనుల్లో ఒకటికూడా చెయ్యలేరు. తను నాలుగు నెలలపాటు జీవించిన పద్ధతిలో ఒక్కపావుగంట జీవించలేరు!

లోకం తప్పుడు పనులకింద కట్టేసిన వాటిని చెయ్యాటంలో ఇంకేమీ లేకపోయినా ఈఒకటుంది—అవి

మనిషియొక్క అనుభవంక్రింద జత అవుతై. ఒకవిధంగా అవి అమూల్యమైన అనుభవాలు. సాహసించి ఆ అనుభవం సంపాదించిన వాడికి మామూలు మనుష్యులు నిర్జీవ ప్రతిమలుగానూ, మామూలు నీతి వేళాకోళంగానూ కనిపించక తప్పదు. వాళ్ళను తీసివేత మనుష్యులకింద కట్టెయ్యజూచే వాళ్ళనుచూస్తే ఒక్కొక్కప్పుడు వాళ్ళను చాలా అసహ్యం వెయ్యటానికి అవకాశం ఉంది.

ఈమనోవికాసం శంకరానికి తల్లిదండ్రుల దగ్గరే వచ్చిఉండవచ్చును. కాని వారికీ తనకూ మొదటినించీ ఒక విధమైన బంధంఉండింది. దాన్ని అతిక్రమించటం అతనికి చాతకాలేదు. పైగా వాళ్ళు తనకోసం నిజంగా బాధ పడుతున్నారు. ఆబాధముందర వాళ్ల తెలియనితనం లెక్కకు రాలేదు. ఈబడితే లంతా తన కెవరు ? వీళ్ళకు తన్ను గురించిన దిగులేముంది? వీళ్ళకు ఏంతెలుసునని తనను కుష్టువాడికింద జమకడతారు ? వాళ్ళు తనకంటె ఏవిధంగా యోగ్యులు ? తనకున్న ధైర్యం లేదనా ? తను వాళ్ళకంటె ఏవింధగా తక్కువ ? తన ఆరోగ్యంగాని శరీరంగాని ఏమీ చెడలేదు. తనకు చివరకు ఆ తాగుడైనా అలవాటుకాలేదు. తాగి తను ఆనందించాడు. ఆ ఆనంద మేమిటో వీళ్ళలో ఒక్కడికీ తెలియదు. పరస్త్రీతో పోయి నాడు తను. తనదగ్గిర ఉన్నంతకాలమూ ఆమనిషి తన కిచ్చిన ఆనందంలో వీరిభార్యలంతా వీరికెన్నోవంతు ఇస్తున్నారో ! అదీకాక ఆమనిషి వీరిలో ఒక్కడి మొహాన ఉమ్మికూడా వెయ్యదు! ......తన కేంలోపం జరిగింది ?

జరిగినంతకాలమూ తనూ ఏలాడు! చాలు ఈజీవితానికి!

శంకరం అభిప్రాయాలన్నిటినీ సమర్థించటం కష్టం. అందులో ఆత్మవంచనా, ముక్కుకుసూటిగా చూచుకోవటమూ లేకపోలేదు. కాని అందులో కొంత నిజంఉంది. అదికూడా ఆటే ముఖ్యంకాదు—అందులో చాలా న్యాయం ఉంది; వాడట్లా భావించి తీరుతాడు, మరొకరింకొకరు అట్లా తర్కించక పోయినా.

౩

తన అత్తవారికి తనను చూస్తే గౌరవం లేనందుకు శంకరం సులభంగానే సరిపెట్టుకున్నాడు కాని వాళ్లు తనను పనివేళా అగౌరవం చెయ్యటం సహించలేకపోయినాడు. పొద్దుటి పూట తను ఎదట లేక పోతే కాఫీకి పిలవరు, లేదా తన దగ్గరికి పంపించరు. తరవాత ఎప్పుడో తను కనిపించినప్పుడు చల్లారిపోయిన కాఫీ ఇస్తే ఇస్తారు లేక పోతే అదీ లేదు. భోజనాలుకూడా అంతే, "అల్లుడు భోజనానికింకా రావడంలేదా ఏం?" అని ఎవరో ఒకరు అంటే, తన మామగారు "ఏంచేస్తున్నాడో దొరగారు!" అనేవాడు. అడుగులకు మడుగులొత్తవలిసిన అల్లుణ్ణి అరిచేతిలో చిక్కించుకుని ఆపెద్దమనిషి పొందుతున్న అవ్యక్తానందానికి అంతులేదు. తనకు వడ్డనచేసేటప్పుడు వంటమనిషి కూడా మారడగటమూ నెయ్యి వెయ్యటమూ మొదలైనవి మరచిపోవటం శంకరం గమనిస్తూ వచ్చాడు. ఈ ప్రవర్తన భరించలేక ఒకసారి అతను వంటమనిషిని కాస్త

హెచ్చరించేటప్పటికి ఆవిణ్ణి వెనక వేసుకొని తన మామగారు "ఆవిడ మరిచిపోతే నువ్వే అడిగి వడ్డించుకోరాదూ ? ఆవిడేమైనా నీకు అత్తగారా ఆడబిడ్డా!" అని కోప్పడ్డాడు.

మామగారు "ఆడబిడ్డ" అనేమాట ఉపయోగించినందుకూ తనను కోడల్ని చూసినట్లు చూడటానికి సరిపోయిందనుకున్నాడు శంకరం. కాని మామగారికి అతనేమీ మారుమాట చెప్పలేదు. అతని వ్యవహారం యావత్తూ బావిలంచున ఉన్నట్లున్నది. తను తొందరపడి ఏదైనా అంటే అందరూ ఒక్కసారి తన మీదపడి జరిగి పోయినదంతా పట్టుకుని దుమ్మెత్తి పోస్తారేమోనని అతనికి భయంగా ఉంది. వాళ్ళ ధర్మమా అని ఎవరూ ఆ గొడవే తీసుక రావటం లేదు. ఒక వేళ తను మామగారితో పోట్లాడి వెళ్ళితే "పుట్టింటికేగా." ఇప్పట్లో అతనికి అది ఏమాత్రమూ ఇష్టం లేదు.

శంకరానికి ఒక్కందుకే కష్టం వేసింది. ఎవరెట్లా ఏడిస్తే తనకేం? తనభార్యా యోగ్యురాలై తనమనిషి కాకూడదూ? ఆమనిషిలో అటువంటి లక్షణాలేవీ కనిపించ లేదు. ఆవిడ తన కెన్నడూ కనిపించేది కాదు. ఆఖరుకు తనకు ఆవిడ చీల్చిన ఆకులన్నా వచ్చేవి కావు తాంబూలానికి. తనకు కాళ్ళు కడుక్కునేటందుకు నీళ్ళివ్వటమో, తుడుచుకునేటందుకు తువ్వాలివ్వటమో అయినా చేసేది కాదు.ఆవిడ తను కనుపడితే దృష్టి పక్కకు తిప్పుకుంటుందనీ, చాటుగానన్నా తనవంక చూడదనీ శంకరం రూఢి చేసు కున్నాడు.

ఎప్పుడైనా ఒంటరిగా చిక్కితే నిలువదీసి నాలుగు మాటలూ భార్యను అందామని చూస్తున్న శంకరానికి

ఆవిడ ఒకసారి చిక్కింది. అతను చెయ్యి పట్టుకోగానే ఏదో పురుగును తాకి నట్టు చెయ్యి విడిపించుకుని ఎడంగా తొలిగింది. శంకరం మండిపడి, అదంతా అసహ్యమా, సిగ్గా అని అడిగాడు. తనను అతనేదో ఫెడేలున తిట్టినట్టుగా ఆమె వెక్కివెక్కి ఏడవసాగింది. అతనికి ఆదృశ్యం చూడడానికి రోతగలిగి, "ఛీ అవతలికి!" అని చీదరించుకున్నాడు. ఆమె అంతఏడుపూ మానేసి అక్కణ్ణించి జారుకున్నది.

౬

**ఇల్లరికం** వచ్చిన మూణ్ణోనాడు రాత్రి శంకరం పార్వతితో పరిచయం చేసుకున్నాడు. పార్వతి అతని మరదలు. పదేళ్లు దాటినపిల్ల. పెళ్ళికావలిసి ఉంది. ఆ రాత్రి వరకూ ఆ పిల్ల అతన్ని పలకరించిగాని ఎదటికి వచ్చిగాని ఎరగదు. ఆమె కూడా తనను కష్టువాడికిందనే కట్టింది కామోలనుకున్నాడు శంకరం. తనను గురించి మిగిలిన వాళ్లంతా అనుకునే మాటలు ఆమె వినకుండా ఉంటుందా?

ఆ రాత్రి అతను భోజనానికి వెళ్ళలేదు. దీపం ఆర్పేసి తన గదిలో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఎవరూ వచ్చి తనని పిలవకపోతే ఆపూటకు భోజనం మానుదామనుకున్నాడు. ఎన్నడూ ఏవిధమైన దారిద్ర్యమూ ఎరగని శంకరానికి ఒకపూట భోజనం మానెయ్యటం దారిద్ర్యం యొక్క అవతలి పొలిమేరగా తోచింది. భయంవేసింది. కాని గుండె రాయి చేసుకున్నాడు.

ఇంతలో ఏదో అలికిడి అయింది. తరవాత చిన్న గొంతు "బావా"

ఆశ్చర్యంలో శంకరం సమాధానం చెప్పలేక పోయినాడు. తనను ఎవరూ పలకరించేవారు లేరని అతనికి తెలుసును.

"అక్కడున్నావా, బావా ?"

శంకరం లేచివెళ్లి స్విచ్చినొక్కాడు. గడపలో పార్వతి నుంచునిఉంది. ఆమె ధైర్యంగాలోపలికివచ్చి "చీకట్లో కూర్చున్నావేం !" అన్నది. శంకరం చెవుల కది దబాయింపుగా వినపడ్డది. ఎవరూ లేని సమయం చూచి పార్వతి తనమీద దాష్టీకం చెయ్యటానికి వచ్చిందనుకున్నాడు.

"భోజనానికి రాలేదేం ? అంతా భోంచేస్తున్నారు."

"నాకు తెలీదే !" అన్నాడు శంకరం ఎగతాళితో కూడిన ఆశ్చర్యంతో.

"భోంచేద్దుగాని, రా, బావా !"

"కానీ, ఏం తొందర ?"

"అమ్మ రమ్మంటున్నది."

పార్వతి గొంతులో అకస్మాత్తుగా ప్రవేశించిన అనుమానం గమనించి ఆ పిల్ల అబద్ధం ఆడుతున్నదని శంకరం గ్రహించాడు. అతను నవ్వుతూ "ఈఇంటోనన్నెవరూ భోజనానికి పిలవరు," అన్నాడు

"అయితేమాన్లే, భోంచేతాం, రా, బావా ?" అంటూ పార్వతి దగ్గిరికి వచ్చి అతని చెయ్యి పట్టుకు లాగింది.

ఆమెను చూచి శంకరం చాలా ఆశ్చర్యపడ్డాడు.

ఈఎడారిలో కూడా ఒక జలప్రదేశం ఉందా అనిపించింది.

"పోదాంలే, అందరి భోజనాలు అయిన తరవాత మనయిద్దరమూ భోంచేతాం కూర్చో. కూర్చుని ఏమైనా కబుర్లు చెప్పు."

పార్వతి మొహం ఆమాటతో వికసించింది. ఆపిల్ల చాలాకాలం మాతామహుడి దగ్గర పెరిగింది. ఆమెకు పల్లెటూరి మర్యాదలు అవీ అలవాటుపడినై. తన బావ స్థానంలో ఉన్నవాణ్ణి చాలా మర్యాదాగా చూడాలని ఆమెకు స్పష్టంగా తెలుసును.

తన బావనుగురించి ఇతరు లనుకున్న మాటలన్నీ విని పార్వతి అతన్ని చాలా అసహ్యంగా ఊహించుకుంది. తీరా చూసేటప్పటికి అతను పెళ్లినాడున్నట్టే ఉన్నాడు. ఈ లోపలఅతను పాడైపోయిం దేమిటో ఆమెకు అర్థంకాలేదు. అక్కడికీ రెండుగోజులపాటు జాగ్రత్తగా అతన్ని గమనించింది. ఇతరులు అతన్ని ఎంత అసహ్యంగా చూస్తున్నారో శంకరంకంటె ఆమె బాగా యెరుగును. తన్నుగురించి చాటుగా అందరూ అనుకునే మాటలు శంకరంఊహించాడు, పార్వతి స్వయంగావిన్నది. ఆమెకు తన బావగారి మీంద రహస్యంగా జాలీ, అభిమానమూ కలిగినై.

ఆమె ఇప్పుడు శంకరంతో తనవాళ్లు అతన్ని గురించి యేమనుకుంటున్నారో అవన్నీ చెప్పేసింది.

తన జీవితంలో ఇదొక అందమైన సంఘటన అనుకున్నాడు; ఇటువంటివి నిజంగా జరుగుతవని అతనికి తెలియదు. అతను పార్వతిని దగ్గిరికితీసుకొని ఆమెచెంపలు

రెండూ కృతజ్ఞతతో ముద్దుపెట్టుకుని "నీమూలంగా నా యిల్లరికం మరింత కష్టమే అవుతుందో సుఖమే అవుతుందో తెలీకుండా ఉంది !" అన్నాడు. పార్వతితో పోల్చితే ఇతరులు మరింత దుర్భరం అవుతారు; కాని పార్వతికోసం ఇతరు లను ఏదోవిధంగా భరించవచ్చునేమో ! శంకరం మన స్సులోవున్న ఈఅభిప్రాయం పార్వతి గ్రహించ లేకపోయి నప్పటికీ తననుచూస్తే అతనికి చాలా యిష్టమయిందని ఆపిల్లకు స్పష్టమయింది.

"అమ్మాయ్, పార్వతమ్మా !" అని ఎవరోపిలిచారు.

"ఇక్కడ ఉన్నాం — నేనూ, బావా !"

"భోజనానికి రా ? ఇద్దరూ రండి."

పార్వతి బావ వంకచూసి నవ్వి తలవూపింది. ఇద్దరూ భోజనానికి బయలుదేరారు.

## ౧౦

మర్నాడు కాఫీకీ మధ్యాహ్నం భోజనానికీ కూడా ఇటు వంటి ఎత్తేవేసి శంకరాన్నికూడా తనతోపాటుపిలిపించింది పార్వతి. అయితే ఈసారి ఆపిల్ల జాగ్రత్తపడి వేళకు ముందే వెళ్లి బావగారి దగ్గిర కూర్చోటం వల్ల అతను కూడా అందరితోపాటే వచ్చి కాఫీ తాగటానికీ భోజనం చెయ్యటానికీ అవకాశం దొరికింది.

కాని శంకరానికి ఇదేమీ బాగాలేదు. పార్వతి యుక్తివల్ల అతనికాపిల్లమీద మమకారం ఏర్పడటమేతప్ప

మరేమీ జరగలేదు. ఆరాత్రి మళ్లీ భోజనాలవేళ ఉత్త నున్నచోటికి పార్వతి వచ్చింది. అప్పుడే ఆపిల్లకు బావ దగ్గర చాలా చనువేర్పడ్డది. ఆమె వచ్చి వెనకనించి అతని మెడచుట్టూ చేతులు వేసి తలమీద చెంప పెట్టి, "ఎప్పుడూ అట్లా ఉంటావేం, బావా!" అని అడిగింది.

ఆపిల్లకు భగవంతుడిచ్చిన ప్రేమించే స్వభావానికి శంకరం ఆశ్చర్యపడ్డాడు. తను చిన్న చిన్న చేతలతో తన ఆపేక్షను సులభంగా ప్రకటించటమేకాక ఇతరులు అట్లా ప్రకటించినాకూడా అర్థం చేసుకునేది. ఆపేక్షగా "పార్వతీ!" అంటేచాలు ఆపిల్లకళ్లు మెరిసేవి. తనశరీరం తగలగానే ఆపిల్లశరీరంలోకి కొత్తశక్తి వచ్చినట్టు శంకరానికి తట్టేది. "ఇటువంటి విచిత్రమైనవ్యక్తి ఈగూడెంలోకి ఎట్లావచ్చింది? ఈపశువులు ఈమెకు ఏమి ఆనందం ఇవ్వగలరు? ఆఖరుకు దీనికెటువంటి తేభ్యం భర్త అవుతాడో!" అనుకునేవాడు శంకరం.

"భోంచేసే వేళ అయింది పోదాం రా, బావా!" అన్నది పార్వతి అతని చేతులు పట్టుకుని లాగుతూ.

"నేను రానులే. నువ్వు వెళ్ళి భోంచెయ్యి."

"ఏవరూ పిలవలేదనేనా? నేను పిలిస్తే చాలదు, బావా?"

"అందుకుకాదు. నాకేమిటో తలనెప్పిగాఉంది. భోం చెయ్యను! నువ్వు వెళ్ళి భోంచెయ్యి."

పార్వతి మారుమాటాడకుండా వెళ్ళి పోయింది. శంకరం నిట్టూర్చాడు. తనను ఎవరో ఎందుకో ఇట్లా పరీక్షిస్తు

న్నారనుకున్నాడు. ఇది రామాయణంలో పిడకలవేటో సుందరకాండో తెలియతేదతనికి.

రెండు నిమిషాల్లో పార్వతి మళ్ళీ వచ్చింది. ఆమె చేతిలో అమృతాంజనం డబ్బా ఉంది. శంకరం కంట జలజలా కన్నీళ్లు రాలినై. అతను వాటిని ఆపలేకపోయినాడు. అట్లా జరుగుతుందని అతను కలలోకూడా ఊహించి ఉండలేదు.

మానవుడు దాదాపు దేనికైనా చప్పున కళ్ళనీళ్ళు పెట్టుకోవచ్చును. సంగీతం వింటూ చప్పున కళ్ళనీళ్ళు పెట్టుకునేవాళ్లున్నారు. అది ఒక్కొక్కరి తత్వాన్ని మానసిక స్థితినీ బట్టి ఉంటుంది. ఆక్షణంలో వారికి ఉద్రేకం వస్తుందేకాని, ఆఉద్రేకం వారికి సుఖమే ఇస్తున్నదో బాధే కలిగిస్తున్నదో కూడా వాళ్ళు నిర్ధారణచేసుకోలేరు. ఆక్షణం దాటిపోయిన తరవాత వారు నిర్ధారణచేసినా ఆనిర్ధారణ సరిగా వుంటుందని నిశ్చయం లేదు. శంకరానికి ఆక్షణంలో అటువంటి ఉద్రేకమే వచ్చింది. అతను కళ్ళుతుడుచుకుంటూ నవ్వాడు కాని, లోపల గుండె పీచు పీచు మంటూనే ఉంది, తన ఉద్రేకంమీద పార్వతి ఏవ్యాఖ్యానం చేస్తుందో అని.

పార్వతి పూర్తిగా ఒకనిమిషంపాటు ఏమీఅననే లేదు. చివరకు చాలా అమాయికంగా "తలనెప్పి చాలాజాస్తిగా ఉందా, బావా?" అన్నది. తను తలనెప్పిబాధవల్ల కన్నీరు కార్చాడని ఆమె అనుకో లేదని శంకరం ఊహించాడు. కాని ఆ తెచ్చిపెట్టుకున్న అమాయికత్వంతో తన పరువు

కాపాడినందుకు పార్వతిమీద అతనికి చాలా కృతజ్ఞత కలిగింది.

"అన్నీవట్టిదే. తలనెప్పి లేదు. పోయిభోంచేతాం, పద!" అంటూ అతను లేచినప్పుడు పార్వతి అతని అశ్రువుల ప్రసంగం తీసుకురానే లేదు.

## ౧౧

శంకరానికి పార్వతికీ స్నేహమయినతరవాత మూడు రోజులకల్లా వారిస్నేహంమీద ఆర్డినెన్సు ప్రయోగించబడ్డది.

"ఎప్పుడూ వెళ్ళి అతనిదగ్గిర కూర్చుంటావు, తప్పు కాదుటే, అమ్మా! పెళ్ళియీడుపిల్లవూ!" అని నలుగురూ పార్వతిని కోప్పడ్డారు.

"నాఇష్టం!" అని సమాధానంచెప్పింది పార్వతి. కాని వాళ్ళామాట అన్నప్పటినించీ అతని దగ్గిరికి వెళ్ళటానికి ఆమెకాళ్ళు వెనకటంతగా దూకటంమానినై.

ఆనాడు పార్వతి తన దగ్గిరికి మామూలుగా రాక పోగానే శంకరం చాలా చిత్రమైన విషయం తెలుసుకున్నాడు. ఆపిల్లతో స్నేహంనించి తను ఏదో అపేక్షిస్తున్నాడు; ఆస్నేహాన్ని ఎక్కువచెయ్యటానికి తను అప్రయత్నమైన ప్రయత్నం చేస్తున్నాడు.

ఈరెండు సంగతులూ తెలుసుకోగానే అతనికి మొదట ఆశ్చర్యం కలిగింది, తరవాత తనమీద తనకే అసహ్యం

వేసింది. ఆపిల్లస్నేహం కోరటానికి తనకేమీ హక్కు లేదు. ఆమెకు తనమీద ఏమైనామమకారం కలిగితేదాన్ని మొగ్గలోనే తుంచివెయ్యవలిసింది. ఆమె జీవితం మరొకరి జీవితంతో ముడిపడబోతున్నది. ఈలోపల ఆమెకు ఎటువంటి ముడులూ లేకుండా ఉండటం క్షేమం.

కాని తనస్నేహభావం దూరంచేస్తే, పాపం, పార్వతి గతి ఏమవుతుం దనిపించింది. శంకరం తన అజ్ఞానంలో పార్వతిని తనుతప్ప వేరేదిక్కులేని దాన్నిగా భావించాడు, తనకు పార్వతి తప్ప ఇంకెవరూ లేనట్టే. ఆపిల్లకూ ఇంటో మిగతావారికీఉన్న సంబంధమేమిటో అతనికి స్పష్టంగా తెలియదు. ఆమెను గురించి ఎవ్వరూ ఏమాత్రమూ పట్టించుకున్నట్టుండేవారు కారు.

పార్వతిని గురించి ఆలోచించటం ఉచితంకాదని నిర్ధారణ చేసుకున్నతరవాత శంకరం తనను గురించి ఆలోచించసాగాడు. ముందు తనదగ్గిర చిల్లిదమ్మిడీలేదు. తనకు కాస్తోకూస్తో ఖర్చుకు కావలిసి ఉంటుందని తనమామగారికిగాని తండ్రికిగాని తట్టలేదు.

"నాచేతులూ కాళ్ళూ కట్టేసి నన్నిట్లా వీళ్ళెందుకు హింసపెడుతున్నారు ? వీళ్ళకు నేనేమపకారం చేశాను ? ఒకవేళ నన్ను నేను హానిచేసుకుని ఉంటే వీళ్ళు నన్ను మరింత బాధించటం దేనికి ? నన్నుచూసి వీళ్ళంతా అసూయ పడుతున్నారా ? వీళ్ళంతా నన్ను ఇంత నిర్దయతో చూడటంవల్ల యోగ్యులయితే, నన్నుచూసి జాలిపడే పార్వతి అయోగ్యురాలనుకోవాలా ? " అని

ఆలోచించసాగాడు శంకరం. తనని చిన్నతనంలో తల్లి దండ్రులు ఎందుకూ పనికిరాకుండా పెంచక పోయినట్ట యితే ఈచిక్కులో ఇంత నిస్సహాయుడై ఇరకవలిసిన అవ సరం ఉండేది కాదేమోనని అతనికి ఆలోచన పోయింది. అతనికి ఆరాత్రి భోంచెయ్య బుద్ధిపుట్టలేదు. భోంచెయ్య మని అతన్ని కాళ్లావేళ్లాపడి ప్రార్థించిన వారుకూడా ఎవరూ లేరు!...

ఆరాత్రి నిద్రపోబోతూ పార్వతి తల్లిని "అమ్మా! బావ భోంచేశాడుటే ?" అని అడిగింది.

"ఏమో! నాకు తెలీదు," అని విసుక్కుంది తల్లి.

పార్వతి మంచంమీదనించి చివాలునలేచి గబగబా మేడ ఎక్కి శంకరం గదికి పరిగెత్తి "బావా!" అని పిలిచింది.

"పార్వతీ!"

"నేనే, బావా. నువ్వు భోంచేశావా?"

"చేశాను."

పార్వతి మారుమాట్లాడకుండా దిగివచ్చెయ్యసాగింది కాని సగంమెట్లు దిగగానే ఆమెకు ఏదో సందేహం తట్టింది, మళ్ళీ మేడమెట్లెక్కి వెళ్ళి "బావా!" అని పిలిచింది. శంక రం పలికాడు.

"అన్నంలో ఏం వేసుకుతిన్నావు?"

శంకరం నిర్ఘాంతపోయి సమాధానం చెప్పలేదు. పార్వతి గదిలో ప్రవేశించి లైటువేసి అతన్ని సమీపించి చేతులు వెనకపెట్టుకుని అతనివంక నిశ్చలంగా చూస్తూ

మాటాపలుకూ లేకుండా నిలబడ్డది.

తనకంగారు దాచటానికి నవ్వుతూ శంకరం "ఏమిటది, పార్వతీ ? "అన్నాడు.

"అబద్ధమాడావెందుకూ ? రా, భోజనానికి."

"ఏంచెయ్యనూ ? నాకాకలికావటం లేదంటే నువ్వు వదిలి పెట్టవని అబద్ధం ఆడాను."

పార్వతి ఎడంగా వెళ్ళి చేతులుకట్టుకుని అతని పెట్టెమీద కూర్చుని అతనికేసి చూడసాగింది.

ఒక నిమిషం గడిచింది. రెండు నిమిషాలు గడిచినై.

"వెళ్ళిపడుకో, పార్వతీ !"

సమాధానం లేదు. అయిదు నిమిషాలు గడిచింది.

పార్వతి తల్లి మేడమెట్లెక్కి వస్తూ, "అమ్మాయి !" అని పిలిచింది. పార్వతి పలక లేదు. తల్లి గదిగుమ్మం దాకావచ్చి లోపలికి తొంగిచూసి "ఏంచేస్తున్నావే ఇక్కడా ? వచ్చిపడుకోవుటే ? నీసంగతి నాకేమీ బాగా లేదే ! " అన్నది.

"పడుకుంటాను. ముందు బావనువచ్చి భోంచెయ్యమను."

"బావ భోంచెయ్యలేదూ ?"

"నువ్వేం కనుక్కుంటున్నావు నీఅల్లుడుగారి సంగతి?"

"నాబదులు నువ్వున్నావుగా ! అయితే భోంచెయ్యక పోవటమేమీ ? ఏమయ్యా !"

"ఇంకా వేళకా లేదనుకున్నాను !" అన్నాడు శంకరం వగకొద్దీ.

“బాగాఉంది, లేచిరా!” అన్నది అత్తగారు ఆజ్ఞగా.

•

## ౧౨

**మొ**త్తానికి పార్వతి తన పట్టుదలతో శంకరానికి కాస్త మర్యాద సంపాదించిపెట్టింది. ఆమెతో వేగలేక అత్తవారు అల్లుణ్ణి ఇప్పుడిప్పుడు కాస్త మనిషినిచూసినట్టు చూస్తున్నారు. ఆపిల్ల పద్ధతులు శంకరానికిచూస్తున్న కొద్దీ ఆశ్చర్యం కలిగించినై. అతనికి మరొకందుకుకూడా నవ్వువచ్చింది—తను ఆవయసుపిల్లతో నీతిగా ఉండవలసిన ఆవశ్యకతకలగటం! అటువంటిసమస్య మరొకరికెవరికైనా కలిగి ఉంటుందా అనుకున్నాడు శంకరం.

శంకరం అత్తవారింటికివచ్చిన తరవాత ఇంటికి ఉత్తరం రాయలేదు. తన మామగారికీ తండ్రికీ ఏమైనా ఉత్తరాలు నడుస్తున్నవేమో అతనికి తెలియదు. అకస్మాత్తుగా ఒక నాడు అతని తల్లి దిగింది.

ఆవిడ పాపం కొడుకును చూసి ఆనందాశ్రువులు రాల్చింది. వీలయితే కొడుకునూ కోడల్నీ ఇంటికి తీసుకొనిపోయే ప్రయత్నంమీదనే ఆవిడ వచ్చింది. అందుకుగాను ఆవిడ భర్తయొక్క అనుజ్ఞ తీసుకురాలేదు. అబ్బాయిని తీసుకుపోతానంటే వియ్యంకుడేమంటాడో తెలియదు. మెల్లిగా వియ్యావరాలితో హెచ్చరిస్తే “చిన్నదాని పెళ్లి అనుకుంటున్నాం, వదినా. అల్లుణ్ణి ఇంకా ఉంచుకోవాలని ఉంది!” అని ఇచ్చకాలాడింది.

"ఇంటికెరారా నాయనా" అంటే కొడుకు ససేమిరా అన్నాడు. అబ్బాయికి అత్తవారింట బాగా జరుగు తున్నది కదా అనుకుని ఆవిడ వచ్చిన దారి పట్టింది.

## ౧౩

**పార్వతి** పెళ్ళి అనుకున్న దానికన్న కూడా త్వరగా నేలయింది. విశేషం ప్రయత్నం అవసరం లేకుండానే ఆపిల్లకు భర్త దొరికాడు. ఎప్పుడైనా శంకరం పార్వతితో, "నీకు తగిన మొగుడు దబ్బున దొరుకుతాడని నాకు తోచదబ్బా!" అని అంటే "పోనీ, ఏందొరక్కపోతే? ఎక్కడా మొగుడు దొరక్క పోతే అక్క మొగుడే గతీ!" అనేది పార్వతి. కాని ఆపిల్లకు మంచివాడు, అందమైనవాడు, చదువుకుంటున్న వాడు, తగుమాత్రం కలవాడు తడువుకోకుండా దొరికాడు.

"పార్వతి అదృష్టం! పార్వతి గుణానికి తగినట్టుగానే!" అనుకున్నాడు శంకరం. తన భార్యకు వరుడి కోసం వెతికి వెతికి వేసారి ఆఖరుకు తనను సంపాదించారు, కాస్త ఈడు తక్కువకు కూడా ఒప్పుకుని. అందుకనే తనకాపరం ఇట్లా ఉంది!

పాతఅల్లుడిమీద కోపం ప్రకటించటానికి శంకరం అత్త వారికి మంచి అవకాశం దొరికింది. వారు కొత్త అల్లుణ్ణి అవసరమైన దానికంటె కూడా అతిగా మర్యాద చేశారు.

ఇదిచూసి సహించలేక పోయిన మనిషి ఒక పార్వతే. శంకరం కూడా గమనించనట్టు ఊరుకున్నాడు. అతని

బుద్ధికి ఇవన్నీ ఎంచదగిన విషయాలుగా తోచలేదు.

"మావాళ్ళ వేషాలు చూస్తే నాకు మండిపోతుంది, బావా! ఇదంతా సహించి నువ్విక్కడ ఎందుకుంటున్నావో నాకర్థం కాలేదు. నీకేం ఇల్లులేదా, వాకిలిలేదా?"

"మీవాళ్ళయినా, పాపం, నన్ను వెళ్ళగొట్టాలనా? నాకుబుద్ధిరావాలనే కాని!"

"నీకేం బుద్ధిరావాలో! అయినా నువ్వెట్లా సహిస్తున్నావంట!"

శంకరం నవ్వి ఊరుకున్నాడు. ఇదంతా ఎందుకు సహిస్తున్నదీ అతనికి తెలుసునుకాని పార్వతికి చెప్పటం ఉచితం కాదని అతను అదివరకే నిర్ణయించు కున్నాడు.

శంకరంఇల్లరికం ప్రారంభించి పూర్తిగాసంవత్సరమైంది. ఈలోపుగా అతనికీ పార్వతికీ కలిగినస్నేహం విశేషంపెరగక పోయినా చాలాబలపడ్డది. మంచి క్షేత్రంలో మొలిచిన మొక్కకు తలతుంచుతుంటే అట్లానేజరుగుతుంది. ఇక్కడ తలతుంచుటం కేవలమూ ఒకరిచేతిమీదిగా కాలేదు, అందరి చేతులమీదిగానూ జరిగింది. వాటిల్లో శంకరం చెయ్యికూడా ఉంది. ఏమయినప్పటికీ వాళ్ళిద్దరికీ ప్రపంచంలో వాళ్ళిద్దరికన్న సన్నిహితులు లేరు.

శంకరం మళ్లీ భార్యను పలకరించనైనాలేదు. భార్యాభర్తలను ఒకటి చెయ్యటానికి అత్తవారుకూడా ఏప్రయత్నమూ చెయ్యలేదు. వారి అభిప్రాయమేమిటో శంకరం ఊహించలేక పోయినాడు.

ఈపరిస్థితుల్లో ఒకనాటి రాత్రి పదిగంటలవేళ తన

భార్య తనగదిలోకి వచ్చి వాకిలి దగ్గరే నిలబడటం చూసి అతను ఆశ్చర్యపడ్డాడు. దీపం ఆర్పేసిపడుకుని ఉండటంవల్ల మొదట్లో వచ్చినదెవరో కనుక్కో లేక పోయినాడు. ఒక క్షణంపాటు పార్వతేమో ననే భ్రమ కలిగింది, కాని పార్వతి తప్పుచేస్తున్నదానల్లే అట్లా నిశ్శబ్దంగా వచ్చి మౌనంగా నిలబడదు. అటు వంటిపని పతివ్రతలకే చెల్లు తుంది. వచ్చినమనిషి తనఇల్లాలైఉండవచ్చును. అతను లేచి దీపం వెలిగించాడు. తనభార్యే—మొహానికి చీరచెంగు అడ్డంపెట్టుకుని నిశ్శబ్దంగా ఏడుస్తున్నది.

ఒకప్పుడు శంకరానికి ఇతరులబాధ యేమాత్రమూ అంటేదికాదు. కాని తను బాధపడటం నేర్చుకున్న తర వాత ఇతరుల బాధచూచి సహించ లేకపోవటం ఒకటి కలిగింది అతనిలో. అతను భార్యను సమీపించి ఆమె మొహానికి అడ్డుపెట్టుకొన్న చేతులు రెండూ మెల్లిగా దించాడు. అతని చెయ్యి తగలగానే ఆమె మొహంలో వున్న దుఃఖానికి తోడు భయమూ, ఒకవిధమైన అసహ్య మూ కూడా జతఅయినై. ఆమె సామాన్యంగా అందక త్తెలలో చేరిన దైనప్పటికీ ఆక్షణాన ఆమెనుచూచిన శంకరా నికి అంత వికృతాకారం ఎన్నడూ చూడలేదనిపించింది.

"ఏంకావాలి నీకు?" అన్నాడు శంకరం గట్టిగా కాకపోయినప్పటికీ అమిత అసహ్యంతో. ఆమె మాట్లాడ లేదు.

"ఇక్కడ పడుకుంటావా?"

అవునని ఆమె తలవూపింది. వెళ్లి పడుకోమని శంకరం

ఆమెకు తన పక్క చూపించాడు. తరవాత అతను గది బయటికి వచ్చి పిట్టగోడమీద అటొకకాలూ ఇటొకకాలూ వేసి కూర్చుని స్తంభాన్ని ఆనుకుని యేదో ఆలోచనలో పడ్డాడు.

ఒకరాత్రివేళ గదిలోకి వెళ్లిచూస్తే అతని భార్య అతని మంచంలో పడుకుని నిద్రపోతున్నది. అతను పడకకుర్చీలో పడుకుని అట్లాగే నిద్రపోయినాడు.

మర్నాడు అతను లేచేటప్పటికి చాలా పొద్దెక్కింది. భార్య పక్కమీద లేదు. కుర్చీలో పడుకోవటంవల్ల అతని శరీరమంతా పట్టుకుపోయినట్లయింది. కదలగానే కీళ్ళన్నీ బాధపెట్టినై. అతను మళ్ళీ కళ్లుమూసుకుని ఒక విధమైన మత్తులో పడ్డాడు.

ఏదో అలికిడి అయి అతను కళ్ళు తెరిచేటప్పటికి పార్వతి కాఫీతోసహా ప్రత్యక్షమయింది.

"నేనింకా నిద్ర లేవలేదు, అప్పుడే కాఫీ తెచ్చావు" అన్నాడు శంకరం.

"పాపం బావగారికి రాత్రల్లా నిద్ర లేదు కామాలు!" అన్నది పార్వతి కొంటెగా నవ్వుతూ. ఆపిల్ల అటువంటి సరసం తనతో ఎన్నడూ ఆడలేదు. రజస్వల అయినప్పటి నించీ పార్వతికి కాస్త కాస్త విషయాలు తెలుస్తూ ఉండి ఉండాలనుకున్నాడు శంకరం.

ఆమె వెళ్ళిపోబోతూంటే "పార్వతీ! ఒకమాట" అని పిలిచాడతను.

"నీళ్ళు తెచ్చి బావగారికి మొహంకడుగుతాను."

"తొందరలేదులే ఇట్లారా!"

పార్వతి వచ్చి నిస్సందేహంగా అతను పడుకున్న కుర్చీ చేతిమీద కూర్చుని "ఏమిటి?" అన్నది.

"రాత్రి మీఅక్కయ్య నాగదిలోకివచ్చి ఎందుకు పడుకుందీ?"

"తప్పా ?"

"కార్యం కాకపూర్వమే పెళ్ళాన్ని మొగుడి దగ్గరికి పంపుతారా ? అది ఆచారమేనా ?"

"అన్నీ ఆచారం ప్రకారమే జరుగుతున్నయ్యా ? కార్యంకాకుండానే ఆడదానికి నెల తప్పటం ఆచారమా?"

శంకరం నిర్ఘాంతపోయి "ఏమిటదీ ?" అన్నాడు.

పార్వతి రహస్యంగా "మాఅక్కయ్యకు రెండో నెల కూడా వెళ్ళుతుంది. ఏమిటా ఆశ్చర్యం! అంతానీకు తెలీనట్టే!" అన్నది నవ్వుతూ.

శంకరానికి ఒక్కసారిగా తల తిరిగిపోయింది. అతని మొహంపాలిపోవటంచూసి పార్వతి నివ్వెరపోయింది. అతి ప్రయత్నంమీద మనస్సు చిక్కబట్టుకుని "పార్వతీ, నిజంగా నాకేమీ తెలియదు. ఈక్షణంవరకూ నాపెళ్ళాం మొహం ఎట్లాఉంటుందో నేనెరగను!" అన్నాడతను.

ఈసారి పాలిపోవటం పార్వతి మొహంవంతు. "పిల్ల "మాఅక్కయ్య—" అని పైన ఏమీ అనలేకపోయింది.

పార్వతి కంగారుచూసి శంకరం నిబ్బరం తెచ్చుకోగలిగాడు.

"ఈసంగతి ఎవరితో అనకుసుమా! ఎందుకూ? అనవసరం! నావంటిదే నాపెళ్ళామూనూ. ఒకరికొకరు తగి

పోయినాం." అన్నాడతను.

## ౧౫

ఇది జరిగిన తరవాత శంకరం ఇల్లరికపు జీవితంలో రెండు మార్పులు జరిగినై. అతన్ని అత్తవారు కొంతమర్యాదతో చూడసాగారు; పార్వతిని గంటలతరబడి దగ్గిర కూర్చోబెట్టుకోవటానికి అతనికి స్వాతంత్ర్యంకూడా వచ్చింది.

పార్వతిలోకూడా మార్పుకలిగింది. ఆమెలో వెనక ఉండిన పొంగూ ఉత్సాహమూ జారిపోయినై. ఆమె మాట్లాడుతున్నా, ఏపనిఅయినా చేస్తున్నా, ఒంటరిగా ఉన్నా ఏదో ధ్యాననిమగ్నురాలల్లే, ఏదో పీడ కలకని మరవలేకుండా ఉన్నదానల్లే ప్రవర్తించ సాగింది. ఆమె తనను పూర్వం చూస్తున్నట్టు చూడటంలేదని శంకరం ఊహించాడు. ఆమె ఇప్పుడు తన ఎదటినించిపోదు, కాని వెనకటిమాదిరిగా చనువుగా దగ్గిరికిరాదు.

శంకరం నాలుగైదుసార్లు ఆవిషయం తరిచినమీదట, "నాకునిన్నుచూస్తే ఏమిటోభయంగా ఉంటున్నది!" అని పార్వతి బయటపెట్టింది. "నువ్వేమిటో కొత్తవాడల్లే కనిపిస్తున్నావు."

"ఏమిటాకొత్త?"

"మాఅక్కయ్య చేసినపని ఎట్లాసహించావు?"

"మీఅక్కయ్యేమిటి? ఎంతమంది చెయ్యటంలేదు!

నేను చెయ్యలేదా ?" అన్నాడు శంకరం నవ్వుతూ.

"అట్లామాట్లాడకు, బావా ! ఆమాటలు నాకు కప టంగా కనిపిస్తై."

"నేను కపటంగా మాట్లాడటంలేదు."

"అయితే నువ్వుమరి మా అక్కయ్యతో మామూలుగా కాపరం చెయ్యబోతున్నావా ? నేను నమ్మను. నీ మొహం ఆరోజున ఎట్లాపాలిపోయిందో నేను మరిచిపోయినాననుకున్నావా ?"

శంకరం కాస్సేపు మాట్లాడలేదు.

"మీ అక్కయ్య చేసినపని నేను ఆమోదించానంటున్నానా? నాకు మీ అక్కయ్య మీద మమకారం ఉంటే బాధపడిఉందును. కాని ఒకటి చెబుతున్నాను, పార్వతీ! మీ అక్కయ్య చేసినపని నువ్వే చెయ్యదలిస్తే భయపడుతూ చాటు చాటుగా చెయ్యకు. అందులో మానుషం ఏమీలేదు, పార్వతీ. నన్ను చూడగానే మీ అక్కయ్య ఏడిచి రాగాలుపెట్టి నిలువునా వణకకుండా ఉంటే అరక్షణంలో క్షమించ గలుగుదును. తనుచేసినపని చూసి తనే భయపడుతున్నది, పశ్చాత్తాప పడుతున్నది, తట్టుకో లేకుండా ఉంది, నేనామనిషి మొహంచూడలేను. మనిషి జన్మఎత్తిన తరవాత చచ్చినా ధైర్యంగా చావాలి, అన హాయతను చూస్తే నాకు ఎంతమంటో చెప్పలేను."

పార్వతి కొంచెం ఉండి మళ్లీ వెనక ఎన్నడో వేసిన ప్రశ్నే వేసింది, "నీకిక్కడ ఏముంది, బావా ?ఇదంతా భరిస్తూ ఎందుకుంటున్నావు?"

"వెళ్ళిపొమ్మన్నావా?" అన్నాడు శంకరం నవ్వుతూ.

"అదికాదు, ఎందుకు వెళ్ళిపోవంటాను!"

పార్వతి ఆ ప్రశ్న ఎందుకు వేస్తున్నదో ఊహించాలని శంకరం ప్రయత్నించాడు. నేను నీకోసమే ఉన్నానని తను సమాధానం చెబితే వినాలని పార్వతి ఉద్దేశమా? తన మనస్సు పార్వతి ఆమాత్రం గ్రహించకుండా ఉందా? ఏమో! పార్వతికి ఏమంత ఏళ్ళుండినై? ఏమనుభవంఉంది?

"నా ఈడుకు నేను విరక్తిగా మాట్లాడితే నువ్వునమ్ముతావో నమ్మవో కాని, నాకు జీవితంలో ఏముంది, పార్వతీ? నేనిక్కడ ఎందుకున్నానని అడుగుతున్నావు. నేను ఆత్మ పరీక్ష చేసుకుని ఎందుకు జీవించి ఉన్నానని అడిగితే సమాధానం లేదు. మొన్న మొన్నటి వరకూ నాకు జీవితంలో ఒక అనుభవం లేదు, మరొకరి అనుభవంతో సానుభూతి లేదు. నన్నుమాఅమ్మా నాన్నా అట్లా పెంచారు. వాళ్ళ తుచ్ఛమైన ప్రేమ తప్పనాకింకేమీ తెలియదు. వాళ్ళు నాకష్టసుఖాలు ఈషణ్మాత్రమైనా తెలియకుండా నన్ను ప్రేమించారు. ఈక్షణాన వాళ్ళప్రేమ నాకు గవ్వ ఖరీదు చెయ్యదు. ఆతరవాత స్వేచ్ఛ కాస్త లభించింది, ఆ అవకాశం దొరకగానే నాకు తుచ్ఛమైన అనుభవం దొరికింది, నా మనసు పరవశం కావటానికి. తాగుడుతో శరీరాన్ని పరవశం చేశాను. నాలో ప్రేమించే శక్తి ఉంది. కాని దాన్ని వినియోగించటానికి సరిఅయినవాళ్ళు దొరకలేదు. దొరికినవాళ్ళమీద వినియోగపరిచాను. జరిగిందానికి నేనేమీ చింతించటంలేదు. అదంతా మరొక విధంగా జరిగి

ఉండటం అసంభవం. నాకు లోకజ్ఞానం లేదు—ఇప్పటికి కూడా. కాకపోతే మెల్లిగానన్నా నేను తెలుసుకుంటున్నాను. తెలుసుకున్న కొద్దీ నాకు ముందు ముందు జీవితంలో ఏమీ ఉండదని స్పష్టమవుతున్నది.

ఇక్కడికి వచ్చిన తరవాత నాకు కొత్త అనుభవం చాలా అయింది. ఇక్కడ నాకేమీ లేదని తోస్తే ఇక్కడినించీ లేస్తాను. కొందరి కొందరి మాదిరిగా నాకు అన్నిరకాల అనుభవమూ అవసరం లేదు. బహుశా నేనిక జీవితంనించి ఇంకేమీ కోరను. నామనసు నిండిపోయిన తరవాత మిగతా జీవితమంతా మరచిపోవటానికి వినియోగిస్తాను."

శంకరం చెప్పినదంతా పార్వతి సరిగా అర్థంచేసుకుందో లేదో గాని ఆమెకు వింటుంటే భయం కలిగింది.

## ౧౬

పార్వతి భర్త వచ్చి తన తల్లిగారికి ఒంటో సరిగా లేదనీ భార్యను పంపమనీ శాక్యంగా అడిగాడు. పెద్దపిల్ల కనే రోజులనీ, తరవాత గర్భాధానంచేసి పిల్లను పంపుతామనీ అత్తవారన్నారు. పార్వతి మొగుడు కాదుకూడదు, ఆనాటి సాయంకాలం బండికి భార్యను తన వెంట పంపి తీరాలన్నాడు. సరే చూతా మన్నారు.

కాని తీరా ప్రయాణం వేళకు చాలా హడావుడిఅయింది. అప్పటికే భోజనాలు తొందరచేసి పెందలాడే కానిచ్చారు.

కాని పార్వతి పెట్టె సర్దుకుని బయలు దేరేటప్పటికి బండి అందటం అనుమానాస్పదమయింది. బయలుదేరటం దండగనని నలుగురూ ఎంతచెప్పినా అల్లుడు వినలేదు.

బండిసాగిపోయిన అయిదు నిమిషాలకు శంకరం తన గదికివెళ్ళి పెట్టె సర్దుకోసాగాడు. ఇంతలో అతని భార్య గదిలోకి వచ్చింది.

"నీదగ్గిర డబ్బేమైనాఉందా?" అన్నాడు శంకరం. ఆమె లేదన్నది. "అయితే నీ మెడలోవస్తువేదైనా ఇట్లా ఇయ్యి!" అన్నాడు. ఆమె మాట్లాడలేదు. అతను వచ్చి బలవంతంగా మెళ్ళో గొలుసు తీసుకొని బయటికి వెళ్ళిపోయినాడు...

అనుకున్నంతా అయింది. పార్వతికి ట్రైను రైలందలేదు. వాళ్ళు ఇరవై నిమిషాలకు మళ్ళా తిరిగి వచ్చారు.

వాళ్ళు వచ్చిన అరగంటకు శంకరం తిరిగి వచ్చాడు. అతని జేబు గలగల్లాడుతున్నది. కళ్ళు జ్యోతుల్లే ఉన్నై, మనిషి పూరాగా తాగి ఉండటంవల్ల నిలవనైనా నిలవ లేకుండా ఉన్నాడు. ఈదృశ్యం ఇంటిల్లిపాతీ చూశారు. అతని మామగారూ అత్తగారూ గలగలా అతనిమీద విరుచుకుపడి అరవసాగారు.

"ష్! మాట్లాడితే చంపేస్తాను!" అంటూ అతను తన గదికి వెళ్ళిపోయినాడు.

ఆరాత్రి పార్వతికి నిద్రపట్టలేదు. ఆమెకు కనపడని గాయం అయింది. ఆమెకు కళ్ళుమూసుకుంటే శంకరం

ఎర్రని కళ్ళతో తూలుతూ కనబడుతున్నాడు. అదృశ్యం కనిపించి నప్పుడల్లా ఆమె శరీరమంతా వణుకుతున్నది. గుండె దడదడా కొట్టుకుంటున్నది. అతన్ని అట్లా ఆమె ఎన్నడూ ఊహించుకుని ఉండ లేదు.

మర్నాటికల్లా శంకరం అదృశ్యుడైనాడు. అతనితో పాటు అతని పెట్టెకూడా అదృశ్యమయింది. అతనిగదిలో ఒక ఉత్తరం మాత్రం ఉంది,

" చిరంజీవి సౌభాగ్యవతి పార్వతికి— నిన్నరాత్రి జరిగిన అపచారానికి నీకుమాత్రం క్షమాపణ చెప్పుకో వలసివుంది. నేనావిధంగా నీకళ్ళపడతానని కలలో అను కొని ఉన్నా జాగ్రతపడి ఉండేవాణ్ణని ప్రమాణం చేసి చెప్తున్నాను—శంకరం."

# స్వార్థబుద్ధి

౧

పూర్వం ఒక దేశాన్ని సర్వజితుడనే రాజు పాలిస్తూ ఉండే వాడు. ఆయన చక్కదనానికి సహదేవుడూ, వివేకానికి నకులుడూ, పరాక్రమానికి అర్జునుడూ, బలానికి భీముడూ, ధర్మబుద్ధికి యుధిష్ఠిరుడూ, దాతృత్వానికి కర్ణుడూనూ. విరోధులపాలిటి యముడుగానూ, అనాధులపాలిటి కామధేనువుగానూ, ధర్మనిర్ణయానికి ప్రహ్లాదుడుగానూ ప్రవర్తించుతూ ఆయన చాలాకాలం దేశాన్ని అపూర్వంగా యేలి దివంగతుడైన పిమ్మట ఆయన యేకైక పుత్రుడు తేజస్వి సింహాసనం ఎక్కాడు.

తేజస్వి అన్నివిధాలా తండ్రికి విరుద్ధంగా ఉండేటట్లు కనిపించాడు. అమిత చిన్నతనం నించీకూడా అతను విపరీతమైన స్వార్థబుద్ధి ప్రకటించుతూ వచ్చాడు. అతనికి తనేమో తనసౌఖ్యమేమో తప్ప మరొక గొడవే పట్టేది కాదు. ఇతరుల కష్టసుఖాలతో సానుభూతి చూపటంగాని తన కష్టసుఖాలయందు ఇతరులు సానుభూతి చూపాలని

కోరటంగాని అతను ఎరగడు. అతను జీవితంలో మరొక ప్రాణికి అణుమాత్రం త్యాగం చూపి ఎరగడు.

అతని ప్రవర్తనను ఏమాత్రం ఇతరులు అరికట్టజూచినా అతను సహించలేక పొయ్యేవాడు. "నా ప్రవర్తనవల్ల నేనే నష్టపడే టట్లయితే నీకెందుకూ ? లేక నీకే నష్టం వచ్చే టట్లయితే నాకేం ?" అని తర్కించేవాడు.

ఈస్వార్థబుద్ధి తప్ప అతనిలో మరేమీలేదు. ఇతరుల ప్రవర్తనను అతను యేవిధంగానూ అరికట్టచూచేవాడు కాడు. ఇతరులమీద అధికారం చెలాయించాలని గాని వారిమెప్పు సంపాదించాలని గాని అతనికి ఉండేది కాదు. అయినప్పటికీ ఆస్వార్థమే అతనికి పెద్దకళంకమయి ప్రజల దృష్టిలో అతనికి సంపూర్ణమైన గౌరవం లేకుండా చేసింది.

తండ్రి చచ్చిపోయినప్పుడు సింహాసన మెక్కటానికీ పట్టాభిషేకం చేసుకోవటానికీ తేజస్వి కొంచెం అభ్యంతరం పెట్టాడు. "నాకీఉద్యోగం అవసరం లేదు. నేను సింహాసనం ఎక్కినట్టుగానే భావించుకుని మీరు రాజ్యాంగం నడపండి !" అని అతను మంత్రితో అన్నాడు.

"అల్లాకాదు, మహాప్రభూ ! మీరు సింహాసనంమీద నామమాత్రం ఉంటేనేగాని పరిపాలన సాగదు. మీరు ప్రజలదృష్టికి దేవేంద్రస్థానం. మీరులేకపోతే నేనేమీ చెయ్యలేను. మీరు సింహాసనంమీద ఉంటేరా, బాధ్యతా, భారమూ నేనే వహించి ఎంతపనిఅయినా చెయ్యగలను. ఈషణ్మాత్రమైనా శ్రమకలగనివ్వను," అని మంత్రిగారుబోధచేసి అతన్ని పట్టాభిషేకానికి ఒప్పించాడు.

తేజస్వి అనుమానిస్తూనే సింహాసనం ఎక్కాడు.

అతని రాజరికం ఎవరికీ తృప్తికలిగించలేదు. ఆస్థాన పెద్దలంతా పెదవులువిరిచారు, అతనికి ఒకవిషయమైనా తెలియదన్నారు. రాజకీవికూడా అతనిదగ్గర లేదన్నారు. అంతసమర్థుడితరవాత ఇంత ఉదాసీనుడూ అసమర్థుడూ రాజుకావటం శోచనీయమన్నారు.

నిజానికి అతనికి చిన్నతనంలో చదువుగాని ఆచారాలుగాని అబ్బలేదు. తను ఎవరో, ఏప్రపంచంలో ఉన్నాడో తెలియనట్టు ప్రవర్తించేవాడు. ఆఖరుకు ధర్మశాస్త్రం కూడా అతనికి తెలియదు. న్యాయచట్టమేమిటో న్యాయనిర్ణయసంప్రదాయం ఎట్లాఉంటున్నదో అదికూడా అతనికి తెలియదు. తనచుట్టుప్రక్కల వాళ్ళాంతా ఎట్లాజీవిస్తున్నారో, కనీసం అదయినా తెలుసుకోకుండా జీవించగలిగాడంటే తేజస్వినిచూసి ఆశ్చర్యపడే వాళ్ళుకూడా లేకపోలేదు.

అతనికి తెలిసిందల్లా ఒకటే—తనసుఖం. దానికోసం అతను చెయ్యి చాచేటప్పుడు తనకీవికే ఆపద కలుగుతున్నదో, సంప్రదాయమే చెడిపోతున్నదో, న్యాయానికే భంగపాటు కలుగుతున్నదో యోచించేవాడుకాడు.

రాజుగారయికూడా తేజస్వి తనవెంట భటులను ఉండనిచ్చేవాడుకాడు, తనకు అవసరంలేని సపర్యలు లాంఛనగా చెయ్యనిచ్చేవాడుకాడు, తనకు ఒంటరిగా ఉండబుద్ధిపుట్టినప్పుడు అందరినీ దూరంగా తరిమివేసేవాడు.

రాజు అసమర్థుడని తేలిపోగానే పెద్దలందరికీ రాజంటే

అలుసయిపోయింది. అతనికి ఉత్సవివిగ్రహం అని పేరు పెట్టారు. సభకు వచ్చినా, తేజస్వి ఏ చర్చలోనూ ప్రవేశించేవాడు కాదు. అతని తరఫున మంత్రిగారే నోరుచేసుకుంటూ ఉండేవాడు. అతని దారిన అతను ఏవైనా పుస్తకాలు చదువుకోవటంగాని, బొమ్మలు గియ్యటంకాని లేకపోతే సింహాసనంలో చేరగిలబడి నిద్రపోవటంగాని చేస్తూఉండేవాడు. నలుగురూ ఏదైనా గంభీర విషయం చర్చిస్తున్నప్పుడు తేజస్వి అకస్మాత్తుగా మంత్రిని పిలిచి "ఎవరినన్నా పాడేవాళ్ళని పిలిపించండి!" అనేవాడు. మంత్రి రహస్యంగా చెవిలో, "ప్రభూ, ఇది సమయం కాదు!" అంటే అతను చివాలున లేచి వెళ్ళిపోయి గాయకులనూ నటకులనూ అంతఃపురానికే పిలిపించుకునే వాడు. ఆ విధంగా సభముగిసేది.

కాని రానురాను ఈ అభ్యాసం తేజస్విలో జాస్తికావటం వల్ల అతను వెళ్ళిపోయిన తరవాత కూడా అతను మళ్ళీ త్వరలోనే తిరిగివస్తాడనే మిషమీద చర్చలు సాగించటమూ సభముగించక పోవటమూ ఆచారంగా పరిణమించింది.

## 2

తేజస్వి పరిపాలనలో ఆస్థానం లొల్లి అయినట్టే పరిపాలన కూడా లొల్లి అయింది. మంత్రి అంతులేని అధికారం చలాయిస్తున్నాడు. రాజాగారికీ ఆయన ముద్రకూ తేడా

లేకపోయింది. ఆస్థానంలో అనేకమంది అధికారం కోసం మంత్రిమీదికి పోటీరావటంవల్ల కక్షలు ఏర్పడినై. మంత్రిగారివిరోధులు అనేకమంది రాజుగారిని తమవైపు తిప్పుకుందామని వ్యర్థప్రయత్నం చేశారు. రాజుగారి చెవి కొరకబోయినవారంతా తమ నాలుకలే కొరుక్కోవలిసివచ్చింది.

కాని మంత్రిగారి విరోధులు అంతతో ఓడిపోలేక ప్రజలో ప్రబోధం సాగించారు. రాజువట్టి అప్రయోజకుడనీ మంత్రి తనకు లేని అధికారాన్ని కూడా చలాయిస్తున్నాడనీ వారు జనసామాన్యంలో ప్రచారం ప్రారంభించారు.

నిజానికి ఇది వృథాప్రచారం. ఎందువల్లనంటే, మంత్రిగారు రాజుగారి అధికారం కూడా తనమీదనే వేసుకోవటంవల్ల ప్రజలకు కలిగిన నష్టమేమీ లేదు. ఈ ఏర్పాటుకు అభ్యంతరం ఏమైనా ఉంటే అది రాజుగారికే ఉండాలి. కాని ప్రజలు అట్లా అనుకుని ఊరుకోలేదు. అట్లా అనుకోవటం ప్రజల మనస్తత్వానికి సరిపడదు. రాజుగారి జులుము సవ్యమైనట్టూ, అది రాజుగారివల్ల వస్తేనే తమకు రుచించేటట్టూ, దాన్ని రాజుగారి బదులు మంత్రిగారు అవలంబించగానే తమ జీవితమంతా తలకిందయినట్టూ ప్రజలు భావించారు. ప్రజలలో మంత్రిగారి మీద ఒక విధమైన అవిశ్వాసం బయలుదేరి క్రమంగా ఒక చిన్న ఉద్యమంగా పరిణమించింది. ఈ అన్యాయాన్ని సహించలేని వాళ్లు కొందరు రహస్యంగా ఒకసమాజం అయినారు. మంత్రిగారికి తెలియకుండా వాళ్లు రహస్య సభలుచేసి కర్తవ్యం ఆలోచించారు.

కాని వేగుల వాళ్ళవల్ల మంత్రి ఈ రహస్యోద్యమం గురించి చాలా వివరాలు తెలుసుకుని, ఉద్యమానికి తలలుగా ఉన్న కలుగురెదుగురిని రాజద్రోహుల కింద విచారణ లేకుండా ఖైదులో పెట్టించాడు.

మంత్రిగారికి విరుద్ధంగా ఉద్యమం ఎందుకు సాగించుతున్నారో ప్రజలకు తెలియనట్టే, ఆ ఉద్యమాన్ని ఎందుకు ప్రతిఘటించుతున్నదీ మంత్రి రాజుగారికి తెలియదు; పరిపాలనలో రాజు కల్పించుకోక పోయినప్పుడు మంత్రి రాజుగారి తరఫున కూడా పని చెయ్యటంలో తప్పేమీ లేదు. అట్లా చెయ్యక పోయి నట్లయితే దేశం అరాజకమయిపోతుంది.

ప్రజలూ మంత్రీ ఒకరినొకరు ప్రతిఘటించారు. మంత్రి చేతిలో అధికారం ఉంది. ప్రజలకు విసుగెత్తకుండా వారికి ప్రోత్సాహ మిచ్చి అగ్నిలో ఆజ్యంపోసినట్టు నడుచుకుంటున్న ఆస్థాన పెద్దలు మంత్రికి పగవాళ్ళుగా ఉండటం వల్ల ఈ ఘర్షణ నానాటికి తీవ్రరూపం ధరించింది. రెండు పక్షాలా ఉద్రేకం హెచ్చిన కొద్దీ నిజం తెలుసుకునేశక్తి తగ్గిపోయింది.

తన రాజ్యంలో జరుగుతున్న ఈ అల్లకల్లోలం తేజస్వి ఎరగడు. ఎవరైనా అతనితో ఆవిషయం పనిపెట్టుకుని చెప్పినా అదంతా మరుక్షణమే నిశ్చింతగా మరిచిపోయి ఉండేవాడే తేజస్వి.

ఈ ఉద్యమానికి నాయకులయిన వారంతా క్రమంగా ఖైదుచేరుతున్నారు. వారిస్థానే కొత్తనాయకులు వస్తున్నారు. ఒక్కొక్క నాయకుడి చేతిలోపడి ఉద్యమం

ఒక్కొక్కకొత్త స్వరూపం పొందుతున్నది. ఉద్యమం వ్యాపించటానికి మంత్రిగారి దౌర్జన్యంతోపాటు ఆయన కుటుంబంలో ఏడుతరాలనించీ ఉండిఉండిన కుళ్ళుయావత్తు పైకిలాగబడి ప్రచారం పొందుతున్నది. ఉద్యమంలో సానుభూతి ఉన్న వారందరి ప్రాణాలకూ మంత్రిగారు రావణ కుంభకర్ణుల శ్రేణిలో చేరినవాడయిపోయినాడు.

ఉద్యమాగ్నికి ఆజ్యం పోస్తున్నవారికి ఆశయూ లేమీ లేవు—మంత్రిగారి మీద విరుద్ధ ప్రచారం తప్ప. వారి మొరఎవరు విని ఉన్నపరిస్థితులు సంస్కరిస్తారో ఎవరికీ స్పష్టంగా తెలియదు. రాజుగారి పినతండ్రిని కాని ఆయన కుమారుణ్ణిగాని రాజుగా చెయ్యటమనేదీ, రాజుగారిని వివాహంచేసుకోమని నిర్బంధించి ఆయనకు కుమారుడు కలగగానే ఆపిల్లవాణ్ణి రాజు చేయ్యటమనేదీ—రెండు అభిప్రాయాలు ప్రచారంలో ఉన్నై. కాని వాటిని సమర్థించేటందుకే ధర్మశాస్త్రం గాని ఆచారంగాని ఆధారం కనిపించలేదు.

ఆస్థాన పెద్దలు అటు జనంలో కలవరం పుట్టించి ఆవిషయం తెచ్చి తేజస్వికి తెలియచేశారు. తేజస్వి చాలా సౌమ్యంగా "ఎవరెట్లాచస్తే మనకెందుకు?" అని తేల్చేశాడు.

ఎప్పుడైనా రాజుగారు ఒంటిరిగా ఉద్యానవనానికి పోతూ ఉండేవాడు. అతని అంగరక్షకులు గోప్యంగా అతన్ని అనుసరిస్తూ ఉండేవారు. ఇట్లా వెళ్ళుతుండగా ఒకనాడు తేజస్విని ఒకపాతికమంది జనంవచ్చి చుట్టుముట్టారు. పాపం వారి అభిప్రాయం తమ ఉద్యమంగురించి

రాజుగారికి మనవిచెయ్యాలనే. కాని వారు రాజును చుట్టి ముట్టిన మరుక్షణమే రాజుగారి అంగరక్షకులు కత్తులు దూసి ఆజనంమీద పడి చిత్రవధ చెయ్యసాగారు. పది మందికి గాయాలయినై, నలుగురు అక్కడే ప్రాణాలు విడిచారు.

తేజస్వి కోపంపట్టలేక తన అంగరక్షకులను తన వట్టి చేతులతో బాదాడు.

"మీరెవ్రరా? యేమిటీ దౌర్జన్యం?" అని కేకలుపెట్టా డతను.

"ప్రభూ, తమరాజ్యంలో యెంత కుట్రలు జరుగు తున్నవో తమరెరగరు. మేం సమయానికి కమ్ముకొనక పోతే ఈనాడు ప్రభువుగారు యేమైఉందురో!" అన్నారు అంగరక్షకులు.

"మీతలకాయ! వాళ్లు నన్నేంచేస్తారు? ఎందుకు చేస్తారు? నన్ను చంపితే వాళ్ళకేమి ఒరుగుతుంది? మీరెందుకు నావెంట తద్దినం, పొండి!" అని రాజు కద్దించాడు.

ఈలోపల అప్పుడే నాలుగువైపులా వార్త వెళ్లింది, రాజుగారిని రాజద్రోహులు చుట్టిముట్టి హత్యచెయ్యబోయి నారనీ, అంగరక్షకులు సమయానికి అడ్డపడ్డారనీ. రాజు గారు అక్కడినించి కదిలి నాలుగడుగులు వేసేలోపల అనేక వందలమంది చుట్టుముట్టారు.

తేజస్వి ఇదంతా సహించలేకపోయినాడు. "మీరంతా నన్నెందుకిట్లా చుట్టుముట్టారు? వెళ్లిపొండి నాతో

మాట్లాడదలచినవాళ్ళు ఇద్దరో ముగ్గురో తోటదగ్గిరికి వచ్చి నన్నుకలుసుకోండి !'' అంటూ అతను సాగివెళ్లాడు.

అతను కోరినప్రకారం ఇద్దరు వాకూ్వరులు తోటదగ్గిర అతని దర్శనం చేసుకున్నారు, మంత్రిగారి దౌర్జన్యాలన్నీ అతనికి విన్నవించుకున్నారు. మంత్రిగారు రాజుగారి అధికారంకూడా చలాయిస్తున్న సంగతి తెలుపుకున్నారు.

"తమరు మాప్రభువులు. మీరేమన్నా చెయ్యండి మేంసహిస్తాం, మీకోసం ప్రాణాలర్పిస్తాం, కాని మంత్రిగారెవరు ? శాసనం చెయ్యటానికి ఆయనకేమి అధికారం? యేలినవారు శాసనము చెయ్యటమూ, ఆయన ఆశాసనాన్ని అమలులో పెట్టటమూ ధర్మం! ఆయనకోసం ప్రాణాలు విడవటం మా ధర్మంకాదు.

తేజస్వి అంతా విని, "మీరు మూర్ఖులు! లేక అబద్దాలాడుతున్నారు! మీరు చావటానికి అభ్యంతరం లేకపోయినట్టయితే ఎవరికోసం చస్తేమాత్రం ఏమిటి? నాకోసం చచ్చేకన్న మీరు మంత్రిగారికోసం చస్తే నేనెక్కువ సంతోషిస్తాను. సరా? శాసనం చెయ్యటం నావల్ల కాదు. అది దిక్కుమాలినపని. మంత్రిగారు మంచివారు కనక అది నెత్తిన వేసుకున్నాడు. నామీద ఆధారపడేటట్టయితే మీకసలు శాసనమే లభించదు. మీకు నిజంగా శాసనం కావాలని ఉంటే మంత్రిగారి శాసనం ఆమోదించండి. శాసనం అక్కర్లేదూ? హాయిగా రాజ్యం విడిచిపెట్టి పోండి. అంతేగాని, 'మాకు శాసనం, కావాలి. అది నువే చెయ్యాలి!' అంటేమాత్రం ప్రయోజనం లేదు.

ఇక పదండి," అని తీర్పు చెప్పాడు.

రాజుగారి సమాధానం ఎవరికీ తృప్తి కలిగించలేదు. తమ రాజభక్తిని ఆయన తేలిక చెయ్యటం వారికిఆగ్రహం తెప్పించింది. కాని రాజుగారికి తిరిగి సమాధానం చెప్ప టానికి ప్రజలకేమీ కనిపించలేదు. రాజుగారు కేవలమూ మందమతి కాడేమోనని ఒకరిద్దరు సూక్ష్మబుద్ధులు భావించ గలిగారు ఆయన మాటలను బట్టి.

రాజుగారి మాటలు మంత్రిగారి అనుచరులకూ నచ్చ లేదు. "రాజుగారు రాజద్రోహానికి ద్రోహదం చేస్తున్నారు. రాజభక్తిని తేలిక చేస్తున్నారు!" అన్నారు మంత్రి తరఫు వారు. కాని మంత్రిగారు మాత్రం నవ్వి ఊరుకున్నారు.

త్వరలోనే ఈఉద్యమం అంతరించింది. నాయకులంతా జైలునించి విడుదల అయి, మంత్రిపక్షం అవలంబించి పద వులు సంపాదించుకున్నారు. ప్రజలు మంత్రిగారి సంపూర్ణ శాసనానికి అలవాటయినారు.

మంత్రిగారికి కొన్ని కొత్తచిహ్నాలూ, బిరుదులూ ఏర్పాటై, రాజ్యాంగంలో ఆయనస్థానం అగ్రస్థానం అయింది.

## 3

తేజస్వికి ఇరవై ఎనిమిదో ఏడు నడుస్తున్నది. అతనింకా పెళ్ళిప్రయత్నం తలపెట్టలేదు. కాని అతను ఇంద్రియా లను కట్టిపెట్టలేదు. అనేకమంది స్త్రీలను అతను దగ్గిరికి

చేర్చాడు. పైగా ఈ అవినీతి ప్రవర్తనను గోప్యంగా ఉంచ టానికి అతను ఎటువంటి ప్రయత్నమూ చెయ్యలేదు. అతను ఎక్కడ ఉండగా ఎప్పుడు ఏ స్త్రీ అతనిదగ్గిరికి వెళ్ళిందో మంత్రిగారిదగ్గిర జాబితా ఉండేది.

రాజుగారు స్త్రీ వ్యసనంలోపడి తననూ ప్రపంచాన్నీ కూడా మరిచిపోయినాడని ఆందోళనచేసినవాళ్ళు పొర పాటుపడ్డారు. అతను ప్రపంచాన్ని ఎప్పుడూ ఎరగడు, తన్ను తాను ఎన్నడూ మరవలేదు; అతనికి స్త్రీ వ్యసనం కాలేదు. అతనికి ఏ వ్యసనమూ లేదు. ఇతరులకన్న అతనికి స్త్రీ వాంఛ అధికంగా ఉండలేదుకాని ఇతరులకన్న అతను స్త్రీనించి ఎక్కువ సుఖంమాత్రం పొందుతూ వచ్చాడు.

స్త్రీని గాఢంగా ప్రేమించే అవకాశం అతనికి లభించ లేదు. ఎందుచేతనంటే అతను తన అవినీతిని గోప్యంగా అట్టేపెట్టకపోవటంచేత పరువుమర్యాదలు కావలిసిన ఉత్త మస్త్రీలు అతన్ని సమీపించటానికి వెనకాడారు. సాహ సించి అతనిదగ్గిరికివచ్చిన ఆడవాళ్ళంతా రెండోరకంవాళ్ళే. పైగా అంత స్వార్థపరుణ్ణి మనస్ఫూర్తిగా ఏ స్త్రీ ప్రేమి స్తుంది ?

ఒకనాడు మంత్రిగారు రాజుగారితో లౌక్యంగా ఈ విషయమై హెచ్చరించాడు.

"తమను ప్రజలు ఆదర్శపురుషుడికింద స్వీకరించగలిగి ఉండాలి. యథా రాజా తథా ప్రజా. మీరే ఇట్లా అవి నీతిగా ప్రవర్తించితే ప్రజలను పట్టపగ్గాలుండవు!" అని

తేల్చాడు మంత్రి.

"నేను చేసేది అవినీతి అయేటట్టయితే నీతి చట్టంలో మార్పులు చేయించండి. ఏమంటే, నేనిట్లాగే కాలం వెళ్ల బుచ్చదలిచాను. ప్రజలంతా నామాదిరిగా ప్రవర్తించితే నష్టమేమిటో నాకు తెలియకుండా ఉంది. ఏమైనా నష్టం ఉంటే నాకేమీ ఫరవాలేదు."

"తమరు ప్రభువు. సామాన్యనీతి తమరిని బాధిస్తుందని కాదు. కాని అవినీతిలోనైనా తమరు శాస్త్ర రసికత్వం చూడాలిమరి! మీదగ్గిరికివచ్చే స్త్రీలు అంతగా ఘనమైన వాళ్ళు కారేమోనని నాసందేహం."

"నేనేంచెయ్యను? ఇంతకంటే ఘనమైన స్త్రీలు నా దగ్గిరికివస్తే నాకేమీ అభ్యంతరం లేదు."

"తమ ధర్మం తమరు మరిచిపోతున్నారు. ఉత్తమజాతి స్త్రీలతో వ్యభిచారం చెయ్యమనే నా అభిప్రాయంకాదు. ఉత్తమ కన్యను వివాహమాడి సంతానం కనటం తమ విధి."

"వివాహమాడకుండా సంతానం కనరాదా? నాకు శాశ్వతమైన భార్య ఇష్టంలేదు. నాకు అవసరం లేనప్పుడు వదిలించుకోవటానికి అవకాశంఉండే తాత్కాలిక వివాహమే నాకు బాగుంది. నాతల్లిదండ్రులు ఒకరినొకరు ఎటువంటి గర్భశత్రుత్వంతో చూసుకునేవారో నేనెరుగుదును. అటువంటి గతి పగవాళ్ళకుకూడా వద్దు."

మంత్రిగారు విసిగి ఊరుకున్నాడు.

రాజుగారి ఆస్థానంలో ఒక పెద్దమనిషి ఉండేవాడు. ఆయన

